సంపుటము 2]  ఆగష్టు 1915  [సంచిక 2

# బాలమిత్ర



## ఒక ధైర్యముగల సరాంగు

జర్మనీదేశపు చక్రవర్తిగారిపేరు విల్యామ్. ఆయన ఒకనాడు ఒక పడవయెక్కి వెళ్లుచుండెను. అది ఒక రేవును సమీపించెను. అచ్చట చాల రాతిబండలున్నందున పడవను నడుపుసరాంగు దానిని మెల్లగా పోనిచ్చుచుండెను. అందువలన చక్రవర్తిగారికి కోపమువచ్చెను. గాని ఆ సరాంగుకు

ఆ స్థలమెట్టి హానికరమైనదో, చక్రవర్తికంటె ఎక్కువ బాగు గా తెలియును. ఇంక కొంచెముత్వరగా వెళ్లినయెడల పడవ బ్రద్దలగునని వాడు బాగుగా నెరుగును. అంతట చక్రవర్తి వెళ్లి వాని స్థలములోనుండి తానే యా పడవ నడప ప్రయత్నించి, గంటకొట్టెనుగాని ఆ సరాంగు ఆయనకు అడ్డమువచ్చి, గంట యెంత మ్రోగినను సరే. పడవను మెల్లగా నడుపవలెను అని యాజ్ఞాపించెను.

"నా యాజ్ఞను మీరెదవా?" యని చక్రవర్తి మరియొక మారు గంటకొట్టి యరచెను.

"గంటను లక్ష్యపెట్టవద్ద"ని సరాంగు చెప్పెను.

చక్రవర్తికి కోపమువచ్చి, లేచి నిలువబడి క్రిందకువెళ్లి ఖైదీనని చెప్పుకొనుమని ఆజ్ఞ నిచ్చెను.

"ఈ పడవ నా అధీనములో నున్నది. రాజుగాని రక్షణ ప్పగాని నా యాజ్ఞలకు మారుచెప్ప వీలుగాదు" అని సరాంగు చెప్పెను.

ఆ పడవమీది పనివారు సరాంగుకు లోబడిరి. అతని కేహాని యను రాకుండవలెనని ప్రార్థించుకొనిరి. సరాంగేమాత్ర మును భయపడక, పడవను సురక్షితముగా రేవులో జేర్చెను. మరునాటికి రాజు తెలివిదెచ్చుకొని, అతనిని గౌరవించి తన సరాంగులకెల్ల నాయకునిగా జేసెను.

మనకు దేవుడు తన వాక్యముద్వారా యాజ్ఞ లిచ్చు చున్నాడు గాన మనము ఆయనకే పూర్ణవిధేయులు కావలసి యున్నాము. ఈ సరాంగు యొక్క ధైర్యము జ్ఞాపకముంచు కొంటావా?

## నీళ్ల మరత్రిప్పే గాడిద



వైట్ ద్వీపములో ఒక లోతైన బావి కలదు. ఒక పెద్ద చక్రమును త్రిప్పుటవలన దానినుండి నీటిని పైకి తోడుదురు. దానిని త్రిప్పుటకు ఒక గాడిదను కట్టుదురు. నీరు కావలసినప్పుడు దానిని తోలేవాడు, ,, టామ్, నీళ్లు కొంచెము

కావలెను. చక్రము త్రిప్పు" అనగానే గాడిద దానిలోకి వెళ్లి తిరుగును. ఎన్నిసార్లు తిరిగితే నీరు పైకివచ్చునో దానికి బాగుగా తెలియును. అది పైకి వచ్చిన తరువాత సరిగా వచ్చి నది లేనిది చూచుటకు అది తన తలను వెనుకకు త్రిప్పి ముందుకుగాని, వెనుకకుగాని జరుగును. ఈ గాడిద ముసలిదైనప్పుడు దానికి దినమునకు అణా రొట్టెను సర్కారువారు ఫించెను ఇచ్చిరి.

---

## తగిన జవాబు

ఒకానొక పట్టణమందు వసించుచున్న రాజు ఒకనాడు తెల్లవారుజామున లేచి తన నగరునకు వెనుకటి రాజవీధిని తొంగిచూచెను. తొంగిచూచి అంగళ్లదగ్గర పడియున్న ఏరి పారవేసిన ఫలాదులను యేరుకొనుచున్న ఒక చిన్న బీద బాలుని చూచి, అతని బీదస్థితికి రాజుగారు కొంచెము విచారమును బొంది లోపలికి తలను తీయునప్పుడు వాకిలి గడప తలయందు దగిలి కొంచెము నెత్తురు వచ్చెను. నేను తెల్లవారి లేచి వీని ముఖమును చూచితిని కాబట్టి నాకు తలయందు గాయము దగిలి నెత్తురు వచ్చినది. ఈలాగుననే ప్రతిదినమును యితని ముఖమును యెందరు చూతురో వారందరికి అనేక విధములగు జెడుగులు సంభవించును. గనుక

యీ బహుజన విరోధిని భూమియందుంచుట ధర్మముగాదు అని వెంటనే కటికవారిని పిలిపించి యీ చిన్నవానిని గొని పోయి శిరస్సు ఖండించి రండని యుత్తరువుచేసెను. అంతట వారు వచ్చి యీ బాలుని బట్టుకొని నీ ముఖము చూచినందున రాజు తలయందు గడప తగిలి నెత్తురు వచ్చినది గనుక నీ తలను ఖండించిరమ్మని యాజ్ఞాపించిరి. కావున రమ్మని బలవంతపెట్టిరి. అప్పుడా బాలుడు రాజును చూచి నేను యొక మాట మనవిచేసిన తర్వాత నన్ను చంపుడని వారిని మిక్కిలి ప్రార్థించెను. అది విని దయగలవారై రాజునకు తెలియజేసి యుతని పంపున వానిని రాజువద్దకు బిలుచుకొని వెళ్లిరి. ఆ చిన్నవాడు రాజును చూచి మిక్కిలి వినయముతో నిట్లనెను. ఓ మహారాజా మీకు అల్పబాధ నా ముఖము చూచినందుచేత కలిగినదని నన్ను జంప నాజ్ఞాపించితిరి. నేను నిదురలేచి మొట్టమొదట తమ ముఖమును చూచితిని గావున నాకు తల ఖండించునట్టి కీడు సంభవించినది. దీని కేమి తీర్పని యడిగి తెలిసికొనిన తర్వాత నా తల ఖండించుటకు యివ్వవచ్చునని మీ సముఖమునకు వచ్చితిని అని బాలుడు మనవిచేయగా రాజువిని లజ్జాక్రాంతుడయి బాలకుని తెలివికి మెచ్చుకొని వానిని తన నగరయందే యుంచుకొని సకల విద్యలు చెప్పించి తుదకు తన మంత్రినిగా యేర్పరచుకొనెను.

# రుచి

దేవుడు కన్నులును, చెవులును, ముక్కును మాత్రమే ఇచ్చి, నోటివలన ఏమయినను మనకు సౌఖ్యము కలుగకుండు



నట్లు చేయగలడు. అయినను ఆయన దానిని కూడ మనకిచ్చి మన బ్రతుకు మరీ సౌఖ్యకరమైనదిగా చేసియున్నాడు. ఆయన దయ యెంత గొప్పది! తినుటకు అరిశెలుగాని, మిఠాయిగాని ఉన్నయెడల ఎంత సంతోషింతుము! అయితే పటికబెల్లమువలె నున్న పటికను ఎవరైన ఇచ్చినయెడల ఏమందువు? “అబ్బా నాకది వద్దు” అని అందువుకదా. మందుకు మంచి రంగున్నదని దానిని త్రాగుదువా? ఒకగ్రుక్కెడు త్రాగి ఇక అక్కరలేదని చెప్పుదువు. మనకు కీడు కలుగచేయువాటిని తినకుండునటుల రుచి చూచు శక్తిని దేవుడిచ్చియున్నాడు. అన్నిటికి ఒక్కటేరుచి ఉండినయెడల మంచినీళ్లనుకొని విష

మునుగూడ త్రాగి చనిపోదుము. ఎప్పుడో ఒకమారు ప్రతిదియు మనకు హానిజేయును గనుక దేవుడు మనకీ శక్తి నిచ్చి, మనకు హాని చేయువాటిని తినకుండునటుల దయచేసి యున్నాడు గాన ఆయనకు మనము వందనములు చెల్లించవలెను.

## సజ్జగింజ జొన్నగింజ

"టప టప టప."

"అదిగో విను. ఏమిటది" అని జొన్నగింజ సజ్జగింజతో అనెను.

"టప టప టప."

"ఔను నాకుకూడ వినబడుచున్నది. ఇప్పుడు తెలిసినది. వానచినుకులు మనలను లేపుటకువచ్చినది" అని సజ్జగింజ అనెను.

"అబ్బా నాకు నిద్రవచ్చుచున్నది. నేను లేవను" అని సోమరితనముగా జొన్నగింజ కునికి నిద్రపోయెను.

ఇంతలో సజ్జగింజ పరుపుమీదనుండి కాళ్లుచాపి తలయెత్తి పైకి చూచెను. అప్పుడు నేల అంతా పచ్చబడి, తడిగా నుండెను. నేలమీద నీళ్లు నిలవబడినవి గాని ఎక్కువ లోతులేవు. ప్రొద్దుపొడిచినది గనుక అవి త్వరలో ఆరిపోయెను.

"టప టప టప" మని వాన పుల్లి కురిసినది. ఈసారి సోమరిగా పండుకొనియున్న జొన్నగింజ లేచినది. తనకు జతగాడు దొరికెను అని సజ్జ సంతోషించినది. ఇంతవరకు అది ఒంటరిగా నుండెను. తరువాత క్రమక్రమముగా కంది పెసర మొదలైనవి అన్నియు లేచిచూచినవి. అవి అన్ని లేచిన పిదప చాల ఖులాసాగా కాలక్షేపము చేయుచు, సంతోషముగా నుండెను.

---

# ప్రకృతి పాఠములు

## 13-వ పాఠము

## ఆకు, రసము

గతపాఠములో ఆకులోని భాగములనుగూర్చి నేర్చుకొంటిమి. అవి దట్టముగాను బలముగానుండి ఆకు సాధ్యమైనంత బాగుగా విచ్చుకొనియుండునట్లు చేయుచున్నవి. అవి ఆలాగుండునట్లు చేయునదేది? నేపాళపు ఆకులు తెలియునా? కొంద రా చెట్టును దుండెపుచెట్టందురు. దాని ఆకులనుండి వచ్చురసమును బుడగలుగా నూదవచ్చును. ఆ చెట్టు ఆకులను చూడండి. అవెంత బాగుగా తెరచుకొని యున్నవో. గాలి బలముగా కొట్టినయెడల అవి కొంచెము



వంగునుగాని, తరువాత మరల ఎప్పటివలెనే ఉండును. గాని ఒక ఆకుకాడను త్రుంచుము. ఏమిజరుగునో కనుపెట్టి చూడుము. కొంచెముసేపటిలో అది మెత్తబడి ముడుచుకొని పోవ నారంభించును. చెట్టుమీద నున్నప్పు డేలాగు నిటారుగా నుండునో ఆలా గెంతమాత్రము నుండదు. దాని ఈనెలు,

పిల్ల ఈనెలు ఎక్కడికైన పోయినవా? లేదు. ఆకుకే యున్నవి. ఆలాగైతే ఆకు యిట్టిగతికి రావడమెందుకు?

ఆకుకాడను చెట్టునుంచి త్రుంపగానే రెండుమూడుబొట్లు రసము త్వరత్వరగా కారిపోవుట చూడవచ్చును. ఆ రసము పోగానే ఆకు నీరసమగును. దానిలోకి చెట్టుకొమ్మల ద్వారా రసము రానేరదు. ఈనెలలలోకూడా కాడలో వలె సన్నని కాలువలవంటి గొట్టములున్నవి, గాని త్రుంపబడినందున రసము వీటికెక్కనేరదు. గనుక ఆకు సడలి, వాడి, ముడుతలుపడిపోవును.

ఆకును త్రుంపినందున రసము బయటికిపోయి ఆకు వాడిపోవును, గాని ఆకు చెట్టురెమ్మకే ఉండినయెడల భూమినుండి వచ్చు రసమంతయు ఎక్కడికి పోవుచున్నది. తిరిగివచ్చిన దోవనే భూమిలోకి పోవుచున్నదా? లేదు. ఆకునిండ, ఇదివరకు చెప్పినట్లుగా రంధ్రములున్నవి. జ్ఞాపకమున్నదా? ఇవి కంటికి కనుపడనంత చిన్నవి. చాల మంచి భూతద్దముగుండా చూచితే కనుపడును. లేకపోతే లేదు. రసములోనుండే నీరంతా ఈరంధ్రములగుండా గాలిలోకిపోవును. ప్రతి ఆకులో నుండి నీరు బయటికి వచ్చును గాన చెట్లక్రింద నీడగా ఉండును. ఎక్కడ ఎక్కువ చెట్లుండునో అక్కడ ఎక్కువ చల్లగా నుండును. చెట్లక్రింద చల్లగా ఉండుటకు కారణము తెలిసినదా?

ఆకులను త్రుంచినప్పటికి అవి వాడకుండా చాలకాలము వరకు ఉంచవచ్చును. వాటి కాడలను నీళ్లలో ఉంచిన యెడల, అవి నీళ్లను పీల్చుకొని వాడకుండును. పాత్రనిండ నీళ్లుపోసి దానిలో కొన్ని ఆకులను వేసినయెడల కొంత కాలమునకు దానిలోనినీళ్లు వెలితిఅయినట్లు కనుబడును. నీరు ఉండు స్థలములన్ని తెలియునా? సముద్రములు, బావులు, నదులు చెరువులు మొదలగునవి యని చాలమందికి తెలుసును. గాలిలోకూడ నీరు ఉన్నది. దానిని చూడగలవా? ఎందువలన? దానిలోకి నీరెట్లు పోయినది? ఎక్కువ భాగము, చెట్లలోని రసముందున్న నీరు ఆకులగుండా పోయినది? ప్రతి ఆకు చిన్నదిగాని ఎన్నో చిన్న ఆకులగుండా పోయునీరే తరువాత గొప్పమేఘములయి, లోకమునకు మేలుచేయునది.

నీవు చేయుపని చిన్నదైనను అట్టి వనేకములుచేరి లోకమునకు మేలుగాని కీడుగాని చేయును.

## బైబిలు పిల్లలు

### యాకోబు

బాలమిత్రలారా! ఈ మాసము ఏశావుయొక్క తమ్ముడగు యాకోబునుగురించి నేర్చుకొందము. లోక

ములో తల్లులకు కడగొట్టు బిడ్డలపై అతిప్రేమ గలిగి యుందురుగదా! అదేరీతిని రిబ్కాకు తన చిన్నకుమారుడైన ఈ యాకోబుపైన విశేషప్రేమ. యాకోబు చిన్నవాడైనను మిగుల యుక్తిపరుడు. యుక్తిపరుల కందరకు స్వార్థ అపేక్ష మెండుకానవే, యాకోబు సమస్త సౌఖ్యములు తనకే చెంద కోరి, అన్నను మోసపుచ్చి జ్యేష్ఠత్వమును, తండ్రిని మోస పుచ్చి, అన్నకు రావలసిన ఆశీర్వాదమును తనకు చెందునట్లు చేసుకొనెను. “ఎంత జేసిన వానికి అంతే ఫలము” అనునట్లు తాను ఇతరుల మోసపుచ్చినందులకు ఫలముపొంది తీరెను. తానే ఇతరులచే మోసపుచ్చబడెను. బ్రతుకు అంతయు దుఃఖ కరమైనదిగాను, మనస్సు నెమ్మదిలేకను ఉండెను. “దేవుడు ప్రతి వారిని అనగా ఎంత పాపులైనను ప్రేమించి వారి పాపముల నుండి వారిని రక్షించ ప్రయత్నము జేయును. ఏలననగా దేవుడు ప్రేమయై యున్నాడు” అని బైబిలు గ్రంథమున వ్రాయబడి యున్నదిగదా దేవుడు యాకోబును మిగుల ప్రేమించెను.

యాకోబు దుఃఖములోను, ప్రేమించిన బంధువుల విడిచి ఏకత్వముగా అడవి ప్రదేశముల ప్రయాణమై పోవుచున్నప్పుడు దైవము అతని మిగుల ఆదరించెను. యాకోబు ఇప్పటికి దైవమును ప్రేమించి, ఆయనయందలి నమ్మిక యుంచ నారంభించెను.

దేవుడు ప్రేమగలవాడైనను పక్షపాతము లేనివాడును మిగుల న్యాయస్థుడునై యున్నాడు. గనుక ఆయన మనము పాపము జేసినట్లయిన, మన పాపములకుతగిన శిక్షనను గ్రహించి తీరును. పాపము! యాకోబు కన్నతల్లినివిడిచి, బహు దూరమునయున్న తన మేనమామయగు లాబాను ఇంట చాలా కష్టపడి పనిజేసెను. ఇదంతయు యాకోబుచేసిన మోసమునకు ప్రతిఫలము. లాబాను పలుమారు యాకోబుతోచేసిన ప్రతిజ్ఞల మార్చెను. ప్రభువు బిడ్డలు శ్రమలపొందుట ప్రభువుచూచి ఊరకొనునా? లేదు దాదాపు ఇరువదియొక్క సంవత్సరములు గొప్ప కష్టము ననుభవించినతర్వాత, లాబానుగ్రామము అగుపదనరామునువిడిచి తన స్వంత స్థలమునకు పోవలెనని యాకోబునకు ఇష్టము పుట్టినప్పుడు దైవము మార్గములో యాకోబునకు అనేక విధముల సాయము జేసెను. „తప్పక చంపివేయవలెన"ని గర్జించు సింహములవలె కోపముతో నెదురుగావచ్చుచున్న ఏశావును క్షణములో మార్చివేసి యాకోబునకెట్టి హానిరాకుండా జేసెను. మార్గమధ్యమున యాకోబు ప్రియభార్య మరణమునొందెను పాపము! ఆయన ఆమె నిమిత్తము బహు అంగలార్చెను ఆమెపుత్రులైన యోసేపు బెన్యామీనుల మిగుల ప్రేమించెను. ఇట్లుండ యోసేపు మారుఅన్నలు అతని ఐగుప్తు దేశీయుల కమ్మివేసెను.

"మూల్గుచున్న నక్కపై తాటిపండు పడినట్లు రాహేలు మరణము విషయమై దుఃఖించుచుండ, మిగుల ప్రేమించిన కొడుకును అమ్మివేయబడెను యాకోబు యోసేపు చంపబడెనని కంటికి కడివెడు నీళ్లు గార నేడ్చెను. ఎప్పుడు కుమారునే మనమున దలచి దుఃఖించుచుండెను. ఈ మిక్కుటమైన దుఃఖము ఆతనిని త్వరలో ముసలివాడగునట్లు జేసెను."

ఇట్టి వృద్ధాప్యములోనుండగా యోసేపు ఇంకను సజీవుడై యున్నాడను వార్తవిని, కుమారుడున్న ప్రదేశమునకు కుటుంబ సమేతముగపోయి నివాసముజేసి సుఖముపొందెను. కొలది వత్సరములైనమీదట కడువృద్ధుడై కుమారులను, మనుమలను చేరపిలిచి వారలదీవించి ప్రాణమువిడిచి పరమకానానుపుర ప్రవేశము జేసెను.

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

నేను మీకొక యుత్తరము వ్రాయవలెనని అనేక మాసములనుండి అనుకొనుచుంటిని. అయినను దేవునిసహాయమువల్ల యిప్పుడుమీకు వ్రాయగలిగినందుకు ఆయనకే




వందనములు. ఇప్పుడు నేను మీకు చెప్పబోవు కథను జాగ్రత్తగా చదువగలరని నమ్ముచున్నాను.

ఒక దేశమందు చక్కగా పటములను వేయుగల పడుచువాడొకడుండెను. అతనికొక పవిత్రమగు మనుష్యుని పటమును దానికి విరుద్ధముగానుండెడు అపవిత్రమగు మనుష్యుని పటమును వేయవలెనను తలంపు పుట్టెను. తుద కతడొక స్థలమందు చక్కని పవిత్రమగు మనుష్య ముఖమునుచూచి దాని తన కాగితముమీద వేసితీసికొనివెళ్లి తనయింటనుంచెను. చూచినవారెల్లను దాని పలువిధముల బొగడుచు, ఆనందించుచు వెళ్లుచుండిరి. అనేకులింక చూచుటకు వచ్చుచుండిరి.

కాని యాతనికా చీకటితోఁగూడిన అపవిత్రమగు ముఖము చాలా సంవత్సరములవరకు గానరాదయ్యె. తుదకతఁడొక కారాగృహమును దర్శించబోవ, నచ్చటొక భయంకరమగు ముఖము గనిపించగా వాని తన కాగితముపై వ్రాసి యా నిష్కళంకమగు బొమ్మ సరసనుంచెను. జనులందరు మొదటి బొమ్మ ననేకమారులు చూచినను దీనినే మెచ్చుకొని రెండవ దానిజూచి మూతిముక్కు విరుచుచు నవ్వుచు వెళ్లిపోవుచుండిరి. కొంతకాలమునకు ఈ పటములు వేయు పడుచువాఁడా భయంకరునిగూర్చి కనుగొనగా మొదట పవిత్రుడుగా యెన్నబడి పటములో వ్రాయబడినబొమ్మ అతఁడేయనియు, త్రాగుబోతుతనమువల్ల అతడా రూపునుండి అట్టి చెడ్డరూపునకు మారెననియు తెలియవచ్చెను. గనుక మనమీ కథవల్ల చాలా బోధ నేర్చుకొనవచ్చును. కల్లు మొదలగు మత్తుపదార్థములను త్రాగకూడదనియు, అట్లు త్రాగుటవల్ల ఆత్మబలము, శరీరబలమును క్షీణించిపోవుననియు, దీని త్రాగి భక్తిపరులు సహితము శోధనకులోబడి భక్తిహీనులవుదురనియు, రూపబలములు సహితము మారిపోవుననియు మనకు నేర్పుచున్నది.

ఇట్లు,

మీ ప్రియబాలమిత్రుడు, కె. జే. జి. సుందరము

సంద్రుపట్టు, ఖమ్మమ్మెట్టు డిస్ట్రిక్టు

C. L. S. PRESS, MADRAS—1915